Registered No. M. 4345.

# యుద్ధ సంచిక.

వాల్యూం II.] మద్రాసు· 1942-వ సం॥ ఏప్రిల్ నెల 24-వ తేది శుక్రవారం [నె 16 రు.

## "ఇండియా రక్షణకు విమానశక్తి అమితంగావుంది"

### ఇండియా సేనాధిపతి వేవెలుగారి రేడియో ఉపన్యాసం

భారత సర్వసేనాధిపతి సర్ ఆర్చిబాల్డు వేవెలు గారు 21-వ తేది రాత్రి ఢిల్లీ రేడియోద్వారా శత్రుదాడి సూచనలగూర్చి, రక్షణ విధానంగూర్చి పెద్ద ఉపన్యాసం గావించిరి. వారిట్లు నుడివిరి—

చిరకాలంనుండి శత్రుదాడి భయంలేనటువంటి ఇండియావంటి దేశమునకు ఒక్కమారుగ ఆ భయం కలిగినపుడు, ప్రజలు తమగతి ఏమవుతుందో యను ఆందోళనయు, అధికారులు తగురీతి రక్షించగలరో లేదో యను సందేహమును కలిగియుండుట సహజము. రెండున్నరఏండ్లనుండి తీవ్రయుద్ధం కొనసాగుచున్నా ఇండియాకు అంటకుండా యుండెను. భారతీయసైనికులు లిబియావైపు తూర్పున మలయావైపుపోయి, శత్రువు ఇండియావైపు రాకుండ చేయగల్గిరి. గత కొద్దినెలలనుండి జరిగిన సైనికచర్యలు ఇండియాకు కొంత బెంగ కలిగించుట సహజము. మలయా, బర్మాలలో చర్యలును, అటనుండి పారివచ్చినవారు చెప్పు కథలును, శత్రువుయొక్క ప్రచారమును, భారతీయప్రజలకు భీతి యెక్కువ చేసినవి.

#### చివర విజయం తప్పదు

ఇండియా రక్షణబాధ్యత పూర్తిగ నాయందే యున్నది. నేను ఎట్టి భయములేదని అసత్యపు ధీమామీకు కలిగించ దలచుకోలేదు, ప్రమాదం లేదని చెప్పను. ఆ ప్రమాదం ఎటువంటిదో దాన్ని వాంచుటకు ఏమి యత్నములుచేసితిమో చెప్ప దలచితిని. ఒక్క విషయాన్నిగూర్చి సంకోచం లేకుండా అభయమివ్వగలను.—ఈ యుద్ధంలో అక్షరాజ్యాల దౌర్జన్యము దురాక్రమణమును అణచివేసి అంత్యవిజయమును మనమే బడయగలము. బ్రిటిషువారు, చైనీయులు, రష్యనులు అమెరికనులు మనకు అండగానున్నారు. వారి సహాయంవలన మనకు విజయం తప్పదు. అది ఎప్పుడు ఎట్లు చేకూరునా అన్నదే చెప్పలేమనిరి. ఇండియాను రక్షించుచున్న సేనల సమర్థతగూర్చి తెల్పుచు, మలయా, బర్మాలలో జరిగిన విషయములబట్టి బ్రిటిషు, ఇండియను సైనికుల శక్తిగూర్చి సందేహం కలిగియుండుననియు జపానుసైనికులగూర్చి భ్రమ కలిగియుండుననియు చెప్పుచు, అక్కడ జరిగిన పొరబాటులు యిక్కడ జరుగవనిరి.

"జపాను సైనికులు ఘట్టివారు, బాగా యుద్ధం చేస్తారు. కాని వ్యక్తిగతంగా చూస్తే, సరిసమానమగు పరిస్థితులలో మన సిపాయిలే వారికన్న నయం. నాలుగునెలలు విరామంలేకుండా విశ్రాంతి లేకుండా, బర్మాలో మన సైనికులు చేయుచున్న నిరోధ కార్యములబట్టియే వాళి శక్తి సామర్థ్యములు తెలుసుకోవచ్చుననిరి.

#### విమానదాడియే రావచ్చును

ఇండియా రక్షణగూర్చి దెల్పుచు, ఇండియాకు సత్వర విమానదాడి ప్రమాదమే గలదనిరి. ఆకాశంపైనుండి నగరాలపై బాంబులు పడుటచే, కొందరికి నగరాలన్ని పూర్తిగ నాశనమయిపోతాయేమోనను భీతి యెక్కువయింది. రాటరుడాముపై, ఇంగ్లాండు నగరాలపై జర్మను దాడుల కథలు విన్నారు. అచట విశేషనష్టం కలిగింది, అయినా ప్రజల నిరోధ శక్తి సహన శక్తి తగ్గలేదు. ప్రజలయందు భీతి యెక్కువచేయుటకే శత్రువులు యీ దాడులు చేయుచుందురు. అట్టి దాడులు జరిగిన చోట్లనుండి వచ్చువారు చెప్పే కథలుగూడ గోరంతలు కొండంతలుగ చెప్పుదురు. అవి నమ్మరాదు.

ఇంగ్లాండు నగరాలపై జర్మను విమానాల దాడి వలెగాని, జర్మనీపై బ్రిటిషు విమానాల దాడివలె గాని, అంత తరుచుగా అంత ఎక్కువగా జపాను విమానాలు ఇండియా నగరాలపై దాడి జరుపుట సాధ్యంకాదు. సింగపూరులో విరామంలేని విమాన దాడి జరుగుచున్నపుడు, ఆ నగరం లొంగిపోవుటకు కొద్దిరోజులకు పూర్వం నే నచటనున్నాను. అంత తీవ్రమగు దాడి ఇండియా నగరాలపై శత్రు వెన్నడు చేయజాలడు. అక్కడ రక్షణలుకూడ తగినన్ని లేకున్నను, విశేష జననష్టం కలుగలేదు. ఒక్కచోట జనులు దాగొనకుండా యుండుటచే యెక్కువ నష్టం కలిగెను. రంగూనులోకూడ అట్లే జరిగెను.

ఇంతవరకు జపానువారు సివిలు ప్రజలపై నిర్లక్ష్యంగా బాంబులు వేయలేదు. కాని వారి కవసరమని తోచినచో అట్లు చేయగలరు. కాని ప్రజలు ఓర్పుతో శాంతంగానుండి, ఎ. ఆర్. పి. నియమములను సరిగ అనుసరించినచో చావు లెక్కువ యుండవు.

### రక్షణ లధికమగుచున్నవి.

ఇండియాలో ఏ ప్రాంతానికి యెక్కువ ప్రమాద మున్నదో ఆ ప్రాంతంలో రక్షణకై విశేషంగా ఫైటరు విమానాలను, విమాన విధ్వంసక ఫిరంగులను పంపితిమి అవి దాడివచ్చే జపానువారికి యిదివరకెక్కడా ఎరుగనంత నష్టం కలిగించగలవు. సింహళంలో కొలంబో ట్రింకామలీ నగరాలపై శత్రువు, రంగూనుపై చలికాలంలో చేసినంత తీవ్రదాడి అధికసంఖ్య విమానాలతో జరిపినా, రంగూనులోకన్న ఎక్కువ నష్టపోయెను.

మన రక్షణ దినదినమునకు యెక్కువ ఘట్టియై ఇండియా అంతట వ్యాపించుచున్నది. నేను వాంఛించినంత దిట్టంగా అన్నివిషయాలలోను ఉండకపోవచ్చును. కొద్దివారాల క్రిందటకన్న యిపుడెక్కువగను, కొన్ని నెలల క్రిందటికన్న చాల ఎక్కువగను రక్షణ సమర్థత కలిగియున్నాము. త్వరలో యింకను హెచ్చగలదు.

విమానదాడి రక్షణకు మూడు ముఖ్యంగా వుండాలి. ఫైటరు విమానాలు, విమాన విధ్వంసక ఫిరంగులు, ఎ. ఆర్. పి. యేర్పాటులు ప్రజల మనో ధైర్యము, సుశిక్షణము. ఈ మూడింట ఆఖరుది మరీముఖ్యం.

### సముద్రంపై దాడి రావచ్చును

అంత త్వరగా కాకపోయినా క్రమేణా అయినా సముద్రంపై నుండి నేలపై నుండి శత్రువు ఇండియాపై దండయాత్ర చేయవచ్చును. ఇండియా సముద్రతీరానికి బెదురుగలదు. హిందూ మహాసముద్రంనుండి జపాను వారిని తరిమివేయుటకు తగిన నౌకాదళశక్తి సంయుక్త రాజ్యాలకు చేకూరువరకు— అది ఎంతోకాలం పట్టదు —శత్రువు సముద్రతీరాన ఏదో మూల దిగుటకు ప్రయత్నించవచ్చును. విశాలమగు ఇండియా సముద్రతీరమంతటా రక్షణ కట్టడములు కట్టుట అసాధ్యము. అన్నిచోట్ల కాపలా సైన్యాన్ని ఉంచలేము. అట్లా చేయదలచుకోలేదు.

శత్రు నౌకలు చేరుతూవుంటే ఎదురుపోయి వాటిని కొట్టే విమానశక్తివలన ఇండియా రక్షింపబడగలదు. అట్లే నేలదిగే శత్రుసైన్యం దిగకుండా, అచ్చోటికి త్వరగ పోయి తమ శక్తినంతా కేంద్రీకరించి నివారించుటకు మన నేలసైన్యములు పాటుబడును. ఈ పనులకై తగురీతి విమానదళములు నేలసైన్యములు వృద్ధిచేయబడెను.

దాడివచ్చే జపానుసేనలు మాతృదేశానికిగాని, వాటి శిబిరాలకుగాని ఎంతదూరం వుంటాయో ఆలోచించండి. వారి సైన్యము ఎంతెంతదూరాలకు విరజిమ్మబడియున్నావో గమనించండి. వారు దాడిచేయనున్న ఇండియా సముద్రతీరం ఎంత నిడివైనదో గమనించండి. వారి నౌకమార్గాలను ఎంత సులభంగా తెగ్గొట్టవచ్చునో ఆలోచించండి. వారు ఇండియాపై దాడిచేసినా చేయవచ్చు; తాత్కాలికంగా ఇండియాలో కొంతభాగం వశపరచుకొన్నా వశపరచుకోవచ్చు, కాని భారతదేశము తన నిజ ధర్మమును నెరవేర్చునంతకాలము అజేయముగ నుండగలదు.

### కష్టకాలం ముందుంది

కష్టకాలం ముందుంది. ప్రమాదం యింకా హెచ్చగలదు. మీపట్ల నా బాధ్యత యింకా యెక్కువైనది. భారత దేశానికిగల ప్రమాదాన్ని మిత్రమండలి రాజ్యాలు గుర్తించినవనియు; మొత్తం యుద్ధకృషిలో ఇండియా యెంత ప్రధానమైనదో గుర్తించిరనియు, ఇండియా ప్రజలకు తగు సహాయం చేసి రక్షించుటకు నిశ్చయించిరనియు, చివరవరకు పోరు సాగించాలని మిత్రమండలివారు స్థిరసంకల్పం కలిగియున్నారనియు, నేను నమ్మకంగా చెప్పగలను. యుద్ధంలో జయించడానికి ఏమి ఆటంకం ఉండదు. కాని భీరుత్వము, కారణంలేని భీతియు విజయాన్ని ఆలశ్యం చేయగలవు.

భారతీయులలో కొందరు ప్రముఖులు శత్రు నిరోధం చేయాలని, భీతిచెందరాదని బాగుగ ప్రజలను హెచ్చరించిరి. ఇండియాలో అందరు, అన్ని

జాతిమత తరగతులవారు, ఆంగ్లేయులు భారతీయులు, ఉద్యోగులు ఉద్యోగేతరులు, ప్రయాణాన్ని శాంతంగా ఎదుర్కొని, తమ తమ విధులను ఫ్యాక్టరీలలోనో, గ్రామములలోనోయుండి మనస్ఫూర్తిగ దేశంకొరకు యీ కష్టసమయంలో పాటుబడితే మనకు చింతేయుండదు; నా భారం చాలవరకు తగ్గిపోవును. అని భారత సర్వసేనాధిపతి జనరలు వావెలుగారు నుడివిరి.

## పండిత నెహ్రూగారి హెచ్చరిక

క్రిప్సు రాయబారములగూర్చి శత్రుదేశాలు రేడియో ప్రచారము చాల చేయుచు, విఫలమయినవని ఎంతయు సంతృప్తిచెంది ఆనందించుచున్నవి. కాని ఇండియాలో నాయకులు గావించిన ప్రకటనలు గాంచి శతృవులు ఆశాభంగం చెంది నిరుత్సాహం చెందక మానరు. పండిత నెహ్రూగారు సంభాషణలు తెగిపోవుటకు ముందును, తరువాతగూడ, స్పష్టంగా ఏమి చెప్పేరంటె, రాజ్యాంగ విధానమెట్లున్నా గూడ జపాను దౌష్ట్యమును ఇండియా నిరోధించక మానదనిరి. ఏప్రిలు 11-వ తేదీన విదేశములందున్న భారతీయులకు సందేశ మొసంగుచు, క్రిప్సు రాయబార ఫలితమెట్లున్నా ప్రతి భారతీయుడును తన శక్తికొలది ఇండియాను రక్షించుట తన విధిగా భావించవలెను. ఈ బాధ్యతనుండి తప్పించుక పారిపోజాలము. ఇండియా అంతకు ప్రమాదం వచ్చినపుడు మనకు భద్రత యెక్కడ? ఇండియా పోతే యింకేముంది, యింకెవరుండి ఏమి ప్రయోజనం? భారతమాత పిలుపును ఆబాలగోపాలం ఆలకించి సేవ చేయాలి. మనలో ప్రతివారును తనవిధి నెరవేర్చుగాక." అని నెహ్రూగారనిరి. సంయుక్త రాజ్యాలు ధర్మంకొరకే పోరాడుచున్న విగనుక జపాను జర్మనీలు ఓడిపోవాలనే తాను కోరుచున్నానని నెహ్రూగారు ఆ మరునాడే పత్రికా విలేఖరుల సభలో తెలిపిరి జోసుగారే శత్రుసైన్యానికి నాయకుడుగ వచ్చినా తాను ఎదిరిస్తానని నెహ్రూగారనిరి.

"ఇండియాపై దాడివచ్చు శత్రులెవరైననుసరే నిరోధించుటకు భారతీయులు సిద్ధపడవలెనుగాని నిమ్మకు నీరెత్తినట్లూరుకోరాదనిరి. ప్రస్తుతసమయమున యుద్ధ ప్రయత్నాలకు అడ్డుతగిలి ప్రభుత్వం వారికి చీకాకు కలిగించరాదనిరి. అట్లా చేస్తే శత్రువును ప్రోత్సాహించినట్లగుననిరి. శత్రువుకి లొంగిపోరాదను స్థిరసంకల్పం ప్రజలకు కల్గించాలి. శత్రుసైన్యం ఏదీ మనకు స్వాతంత్ర్యం యిస్తుందనుకోరాదు. అట్లా చేస్తే పిరికిపందలనుకుంటారు. దేశాన్ని బానిసత్వంనుండి విముక్తి శత్రుసేన చేస్తుందనుకోడం బానిసలక్షణం" అని పండిత నెహ్రూగారు నుడివిరి.

రాజ్యాంగ చర్చలెన్ని జరుగుతున్నా, దురాక్రమణకు గడంగిన ఎటువంటివారినైనాసరే ఎదిరించి నిరోధించుటకు భారతీయులు స్థిర సంకల్పం కలిగియున్నారనుట నిస్సందేహము

## పెక్కు జపాను విమానాలు నాశనమగుట

### బర్మాలో విమాన విధ్వంసక ఫిరంగుల విజయము

బర్మాలో ఉన్న భారతీయ బ్రిటిషు బర్మావారి ఫిరంగిదళములు అతిసూటిగా గురితప్పకుండ గుండ్లు ప్రేల్చి పెక్కు జపాను విమానములను పడగొట్టినవి. ఇపుడు జపాను విమానములు దిగువకు దిగుట మాని, మన ఫిరంగిదళములున్న చోట్ల 20,000 అడుగుల పైనే ఆకాశంలో ఎగురుచుండును.

బర్మాలో పడిన మొదటి శత్రువిమానం బర్మా ఆగ్జులరి ఫోర్సు ఫిరంగిదళమువారిచే పడగొట్టబడెను. ఈ దళమువారు రంగూను దాడిలో 8 విమానములను నిశ్చయంగా పడగొట్టిరి. ఇంక రెండు సందేహం. అటుతరువాత యితర ప్రాంతాలలో యింకా ఎక్కువ విజయమును బడసిరి.

ఒక బ్రిటిషు ఫిరంగిదళము రెండు రోజులలో నాల్గు శత్రువిమానములను పడగొట్టును. అందు రెండు కాలిపోయినవి. ఇంకా భారతీయ ఫిరంగిదళము బర్మాలో వివిధ ప్రాంతములందు అనేక విజయములను బడసెను. ఒక ఇండియను తేలిక ఫిరంగిదళముకూడ దిగువగ ఎగురుచున్న ఫైటరు శత్రువిమానములను వేగుచూడ వచ్చిన విమానములను పడగొట్టెను.

పలుసారులు శత్రువిమానాలు మన ఫిరంగులెక్కడనున్నవో కనిపెట్టి వానిపైనే దాడిచేసి ఫిరంగులు నిరుపయోగ మొనరించుటకు ప్రయత్నించినవిగాని, నేల ఫిరంగులు కడుతీవ్రముగ గుండ్లు వదలుటచే విమానాలు ఒకేసారి తమ బాంబులన్నింటిని చాల ఎత్తునుండి జారవిడిచి పారిపోయినవి. అందుచే బాంబులు గురిలేకుండ పడినవేగాని నష్టమేమి లేకుండెను.

# బ్రిటిషు తీరపు వర్తకనౌక జర్మను బాంబరును పడగొట్టుట



తీరముననున్న బ్రిటిషు వర్తకనౌకలు ఒక రేవునుండి యింకొక రేవుకు విలువగల సరకులను గొనిపోవునప్పుడు అనేక విపత్తులను దప్పించుకొని, అనేక శూరకార్యములను జేయుచుండును. వానికి కాన్వాయి యనెడు రక్షణ లేకపోయినను జర్మను బాంబరులు చాటున వచ్చి కొట్టిపోవునప్పుడు ఈ పడవలు చాల ధైర్యముగా పోరాడును. అనేకసారులు శత్రువునకే మంచి దెబ్బతగులును. ఇట్టి కార్యమొకటి యిటీవల జరిగినది. సెంటు యూనన్ అను చిన్నతీరపు పడవను జర్మను బాంబరుచూచి యెదుర్కొన్నది. ఈ పడవ కప్తాను సి. హెచ్. రాబర్ట్సు అను నతడు ఈ బాంబరు దగ్గరకు వచ్చుటయు, 1000 అడుగుల ఎత్తులో చుట్టుతిరిగి, క్రిందికిదూకి, తుపాకులతో గాల్చబోవుట కనిపెట్టెను. కాని తొందరపడక, బాంబరును తలపైకి రానిచ్చి, తన యొద్దనున్న ట్విన్ లూయిస్ తుపాకులను ప్రేల్చినాడు. జర్మను విమానము ఆ గురికి యెరయై మంటలు మండుచు విరిగి సముద్రములో పడిపోయినది. చిన్నపడవమాత్రము నష్టము కాకుండ తప్పించుకొని పోయినది.

---

# విమానదాడి వస్తే ఏం చెయ్యాలి

**వాగోవాలి—చెవులు మూసుకోవాలి—గోడకు ఆనుకోవద్దు**

విమానదాడి జరిగితే రోడ్డుపైనున్న ప్రజలు ఏ విధంగా రక్షించుకోవాలో తెల్పుచు ఎ. ఆర్. పి., 1-వ భాగం, 6-వ నెంబరు పుస్తకమును ఇండియా ప్రభుత్వంవారు ప్రకటించిరి. నేలను బోర్లపడి మోచేతులపై నానుకొని పండుకొనుట చాల అవసరమని అందు తెలిపిరి.

బాంబుల విషయములో ముఖ్యంగా జ్ఞాపకం ఉంచుకోవలసిన విషయమొకటి గలదు. బాంబులు పడి ప్రేలినప్పుడు, వేడిగాడ్పు, తునకలు, గాజు ఇనుము ముక్కలు అన్ని పై కెగురుచుండును. కావున పెద్దబాంబు శబ్దం చేస్తూ పడుచుండినచో నేలగోతులు చేరువలో లేకుండినయెడల, నిలచి యుండుటకన్న బోర్లపరుండుట మంచిది. అదిన్ని సమమట్టంగానున్న నేలనుకాక భూమిలో త్రవ్వి యుండు కాలువలోనైన పరుండుట మంచిది,

### శ్రేయస్కరమగు మార్గం

శ్రేయస్కరమగు మార్గమేమన, బోర్లపండుకొని మోచేతులపై నానుకొని గుండె నేలకు తగులకుండ చేతులు రెండు చెవులను మూయునట్లుంచి, తల వెనకభాగమున రెండు చేతుల వ్రేళ్లు కలుపవలెను. గుండె నేల తగులకుండా వుంటే నేల అదిరినప్పుడు గుండెకు దడ యుండదు. చెవులుమూస్తే ధ్వనికి చెవుడు రాకుండా వుంటుంది. చేతిగుడ్డగాని, యిం

కేదైనాగాని పండ్లమధ్య కరచుకొనియుంటే, పండ్లకు నోటికి అపాయం ఉండదు. నాలుక కరుచుకపోవడం వుండదు.

బాంబు ప్రేలినచోటికి దగ్గరలోనుండు ఇండ్లు బాంబు ప్రేలిన గాడ్పునకే పడిపోగలవు. కాని మానవశరీరానికి ఆ గాడ్పువలన అంత యెక్కువ అపాయం ఉండదు. ప్రేలినచోటికి అతి చేరువగ నుంటే గాడ్పువలన ఊపిరితిత్తులు యితర అవయవాలు చెడవచ్చునుగాని, చచ్చిపోరు.

గాడ్పువలన నోటిలోనుంచి ముక్కులోనుండి ఒంట్లో గాలీ పైకివచ్చి ఊపిరాడదనియు, లోపలి అవయవాలు చెడతాయనియు చెప్పుట సరికాదని తెలిసెను.

### చెవుల రక్షణ

గాడ్పువలన చెవులు గడియలు పడి చెవుడు రావచ్చును. ప్రత్తిగాని నూలుగాని వాస్లైనులో తడిపి చెవులలో వదులుగ పెట్టుకొనుట మంచిది. అందువలవ శబ్దం వినబడదు, చెవి చెడదు.

బాంబు ప్రేలితే పైకెగిరే తునకలుగాని విమానాలను కొట్టే ఫిరంగులు ప్రేలినపుడు ఎగిరే రవ్వలుగాని తగలకుండా గోడలే రక్షింపగలవు. కాని ఇంటిలో నున్నా, వెలుపలనున్నా గోడల ద్వారాను నేలద్వారాను వచ్చు షాక్ (విద్యుచ్ఛక్తి వంటి శక్తి) శరీరం లోభాగాలకు చాల నష్టం కలిగించగలదు. కావున ఇంటిలోని గోడలకుగాని, ట్రెంచి కట్టడములలో గోడలకుగాని ఆనుకొని యుండరాదు. ప్రత్తిపరుపు కప్పుకున్నా, పెద్ద కోటు చుట్టపెట్టుకున్నా మంచి రక్షణ యుండును.

మంచి రక్షణకు తగిన కట్టడము లేనపుడు తలయు తదితర ముఖ్య ప్రధాన శరీరభాగములను దట్టమయిన రగ్గుతోగాని, కోటుతోగాని, చివరకు పెద్ద పుస్తకంతోగాని కప్పియుంచుట మంచిది.

### తలుపులు తెరిచి యుంచండి

ఇండ్లలో నున్నపుడు వెలుపల గోడప్రక్కన కంటే, లోపల గది గోడల ప్రక్కనుండుట మంచిది. కిటికీకిగాని, ద్వారానికిగాని ఎదురుగ నుండరాదు. రెండు గోడల మధ్యనుండు మూలలు మంచి రక్షణ స్థానములు. ఎగిరివచ్చే గాజుపెంకులు ఎక్కువ గాయాలు చేస్తాయి. కిటికీలు తెరచియుంచితే బాంబు ప్రేలితే వచ్చే గాడ్పుకి నిరోధం ఉండదు, కిటికీ ముక్కలుకాకుండా నిలుచును, ప్రమాదం తక్కువ. కావున కిటికీలు తెరచియుంచుట మంచిది. కాని ఆ తెరచిన కిటికీలోనుండి గాజుపెంకులు ఎగిరి వచ్చి తమపై పడకుండా రక్షించుకోవాలి. అందుకు తగిన సాధనము లన్నియు ప్రభుత్వంవారి 6-వ నెంబరు బుక్కులో తెలుపబడ్డాయి

ఇంట్లోగాని, గోతిలోగాని దాగుంటే అక్కడనే యుండాలి. పైనేమి జరుగుచున్నదో ఎక్కడ జరుగుచున్నదో చూచుటకు పోరాదు. అట్లా లేచి పోయినవారు ఎందరో రెండోబాంబు పడి చని పోయినారు.

---

## హిట్లరు భీముని భామవేషం

పూర్వకాలంలో, నాటకాలు సినిమాలు రాకపూర్వం, వీధి భాగవతములు ఆడుతూ ఉండేవారు—వీధి భాగవతంలో భామ వేషం ఎట్లా ఉంటుందో చూడడంకోసం జనం యావత్తూ కని పెట్టుకొని కూర్చునేవారు. కాని, ఆ భామవేషం ఎంతసేపు ఎదురుచూచినా తెర బయటకు వచ్చేదికాదు. భామవేషం "ఇదుగో వస్తోంది, అదిగో వస్తోంది" అని చివరకు గుగ్గిలం పొగవేసేవారు—అప్పుడు భామవేషం బయటకు వచ్చేసరికి రాత్రి రెండు జాములుదాటి మూడోజాము అయ్యేది. అప్పుడు ఆ భామవేషానికి తెర తీసేవారు "భామానే! సత్యభామానే" అని దీర్ఘాలు తీస్తూ తెరబయటికి వచ్చేది. భామవేషంలో ఏదో గొప్ప విశేషం ఉన్నదనిన్ని, భామవేషం లేకపోతే భాగవత కథ రక్తికట్టదనిన్ని జనం ఎదురుచూచేవారు. కాని, ఆ భామ వేషం బయటకు రావడానికి ఆర్భాటం చాలా ఉండేది. ఆఖరుకు ఆ సత్యభామ శ్రీకృష్ణులవారిమీద మోహం నిలుపలేక విరహతాపం జెంది ఒక లేఖ వ్రాసేది. తెల్లవారేసరికి సత్యభామకు విరహవేదనపోయి ప్రసవవేదనకూడా వచ్చేది. "అమ్మా! ఓర్చుకో! ఓర్చుకో!" అని ప్రక్కనున్న చెలికత్తె ఓదార్చుతూ ఉండేది. అంతటితో ఆ రాత్రికి భాగవతం చాలించవలసిన స్థితివచ్చేది. ఎందుచేతనంటే, తూర్పు తెల్లవారుతూ ఉండేది. రాత్రిఅంతా చూచిన కథఏమిటయ్యా అని లెక్క చూచుకుంటే పర్యవసానం ఏమీ కన్పించేది కాదు. భామవేషము యొక్క ఆర్భాటంమాత్రం అమితంగా ఉండేది.

ఈ రోజున ప్రపంచమునంతను, తనకొరకు ఎదురుచూస్తూ ఉండవలసినదని కూర్చుండబెట్టినది ఎవరు? ఈ మహాప్రపంచమును యుద్ధములోనికి లాగినది ఎవరు? ఇన్ని రాజ్యాలవారిని యుద్ధరంగంలోనికి తీసికొనివచ్చింది ఎవరు? ఈ భాగవతమంతా ప్రారంభించినది హిట్లరు. యుద్ధసామర్థ్యంలో తన జర్మనీ దేశాన్ని చాలా తర్ఫీయతు చేసినాననిన్ని, తన పరాక్రమాన్ని జర్మను ప్రజలకు చూపించవలెననిన్ని, ప్రపంచమునకంతకు చూపించవలెననిన్నీ హిట్లరుకు సంకల్పం కలిగింది. యుద్ధసామగ్రిని అమితంగా హిట్లరు ఇదివరకే తయారుచేసుకొన్నాడు. యుద్ధానికి కావలసిన కసరత్తు యావత్తూ ఇదివరకే చేసాడు. తన సేనలచేత యుద్ధకసరత్తులు చాలా చేయించాడు. యుద్ధం చెయ్యడం అనేది గజ్జెకట్టి భాగవతం ఆడుటవంటిదే అని హిట్లరుకు ఒక భ్రమ కలిగింది. తనకంటె ఇతరరాజ్యాల వాళ్లెవ్వరూ యీ యుద్ధవిద్యలో సన్నాహములు చేసికొని తగినంత సాధకం చెయ్యలేదనే గర్వం, స్వాతిశయం హిట్లరుకు కలిగింది తాను నేర్చిన యుద్ధవిద్యను

లోకానికి ప్రదర్శించి, తన వేషంవల్లను, తన సమ్మోహనాస్త్రముల వల్లను లోకాన్ని భ్రమింపజేసి లోకం యావత్తు తనకు దాసోహమ్మనేటట్లుగా చేయగలననే అహంకారంతో యీ సంగ్రామ భాగవతం సాగించాడు

ఈ భామవేషగాడు ఇదివరలో కొన్ని దేశములందు తన విద్యనుచూపించి, ఆయా దేశాలలోని ప్రజలను తన ప్రభావం చేత ఆకర్షించాడు ఆ మాట నిజమే కాని, వీడి విద్యకు పరీక్షాసమయము వచ్చింది అభినయశాస్త్రం పూర్తిగా తెలిసిన పండితులు సభలోనికి వచ్చికూర్చున్నప్పుడు, తన ఆట వాళ్లముందర సాగదనే భయంచేత, ఈ భామవేషగాడు ఎంతసేపు ఎదురుచూచినా, తెరతీసి బయటికిరాడు. ఎందు చేతనంటే, తాను నేర్చిన విద్యలోనే, ఆరితేరిన పండితులు సభలోనికి వచ్చారని తెలిసినప్పుడు, తనకు సభలో పరాభవం తప్పకుండా జరుగుతుందనే భయం భామవేషగాడికి ఏర్పడుతుంది అందువల్ల "ఇదుగో, అదుగో!" అని తెరవెనుకనే ఉండి, ఆర్భాటం చేస్తూ ఉంటాడు ఈ ఆర్భాటంతోనే తెల్లవారుతూ ఉంటుంది. సభలో కూర్చున్న పండితులు అభినయశాస్త్రం బాగా తెలిసినవారే కాని, అదే తమ వృత్తిగా చేసికొని, జీవనోపాధులను సంపాదించేవాళ్లుకారు. శాస్త్రం తెలుసునుగాని, దానిని నిత్యవిధిగా, పండితులు సాధకంచేసేవాళ్లు కారు.

ఈ భామవేషగాడైన హిట్లరు పెద్ద గౌరవకుటుంబంలో పుట్టినవాడుకాడు. గొప్ప రాజవంశంలోని వాడుకాడు. బాల్యంలో జీవనోపాధికూడాలేని దరిద్రం అనుభవించాడు వంశపారంపర్యంగా శౌర్యప్రతాపములుగాని, పరాక్రమ విక్రమములుగాని, వీనికి రక్తసంబంధంగా సంక్రమించియుండ లేదు చాలాకాలం చిత్తరువులు, బొమ్మలువ్రాసి, ఆ బొమ్మలు అమ్ముకొని జీవించాడు కొన్నాళ్లు, గోడలు కట్టుతూ కూలి పనులుచేసి జీవించాడు. కొన్నాళ్లు కుట్టుపనివానివద్ద ఉండి కాలక్షేపం చేసాడు. ఈ విద్యలన్నీ పూర్తి అయిన తర్వాత, చిట్టచివరకు, కలిపురుషుని ప్రభావంవల్లనూ, కాల వైపరీత్యం వల్లనూ, జర్మనీలోని ఎన్నికలలో ఎట్లాగో వోట్లు సంపాదించి, తన మాటల భేషజంవల్లనూ, స్వదేశాభిమానమనే పేరుతో తన నాజీపార్టీని వెంటబెట్టుకొని, కొన్ని దుర్మార్గములనుచేసి, తన శిష్యవర్గం వృద్ధిచేసికొని ఒక పెద్ద పీఠాధిపతిలాగున జర్మనీలో వెలిశాడు ఇది కలికాల మాహాత్మ్యం అంతకుతప్ప మరేమీ లేదు నరసింహ శతకంలో చెప్పినట్లు "పూర్ణకుంతలు సభాపూజ్యులైరి ప్రాతలంజలు లోకమాతలైరి" యుద్ధం అనేది ఎటువంటి ధర్మసంకల్పంతో చెయ్యవలెనో, ఎటువంటివారితో చెయ్యవలెనో, క్షత్రియుడైనవాడు తన కత్తిని ఎంత పవిత్రంగా ఉపయోగించవలెనో, సద్వంశ సంజాతులైన రాజ్యాధిపతులకు బోధపడినట్లుగా, అల్పజాతివానికి బోధపడదు. కత్తి చేతబట్టి కత్తిసాము సాధకం చేసినంతమాత్రముచేత ఎదురైన ప్రతివానిని నరికిపారవేయవచ్చునని అనుకుంటాడు. వీధులలో తిరిగే శునకమును కనకపు సింహాసనముమీద కూర్చుండబెట్టినయెడల, అనేకములైన అపభ్రంశములైన పనులను చేస్తుంది పల్లకీలో కూర్చుండబెట్టితే, పల్లకీ కుచ్చులన్నీ కొరికివేస్తుంది అదేవిధంగా, జర్మనీరాజ్యముయొక్క పరిపాలనాధికారం యావత్తూ కాల వైపరీత్యంవల్ల యీ అల్పుని చేతిలోనికి వచ్చింది రాజ్యాధికారం తనచేతికి వచ్చినప్పటినుండియు, యుద్ధానికి ఆయుధాలు తయారుచెయ్యడమే తన కర్తవ్యమని నిర్ణయించుకున్నాడు ఇరుగుపొరుగు రాజ్యములనన్నింటినీ ఆక్రమించడమే తాను చూపవలసిన ప్రతాపమనుకొన్నాడు. ప్రపంచములోని పెద్ద రాజ్యాలతో, పెద్ద రాజ్యాలను పరిపాలించేటువంటి గొప్ప గొప్ప రాజాధిరాజులతో స్నేహంచేసి, సఖ్యతగా ఉండి, తానుకూడా గౌరవం పొందవలెననే కుతూహలంగాని, జర్మనీకి తన ద్వారా గౌరవ మర్యాదలు సంపాదించవలెననే కుతూహలంగాని, హిట్లరుకు కలుగలేదు ఉన్నత రాజవంశముల వారితో యీ అల్పుడు తాను సమానహోదాగల గౌరవమును పొందజాలననే సంగతి గ్రహించాడు. వాళ్లనందరినీ జయించి తానే లోకానికి సాటిలేని మేటినని చాటించుకొనుటకు నిశ్చయించాడు అందుకని యుద్ధవిద్యలో బాగా సాధకంచెయ్యడమే తన కర్తవ్యమని నిశ్చయించుకున్నాడు ఈవిధంగా తన ప్రతాపం జర్మను ప్రజలకు చూపించి, జర్మను ప్రజలందరిచేత తానే సమర్థుడైన రాజ్యపరిపాలకుడ ననిపించుకొని, తనకు లభించిన రాజ్యాధికారపదవిని కాపాడుకోవలెనని నిశ్చయించాడు. సౌమ్యంగా, యిరుగుపొరుగు రాజ్యాలతో సఖ్యతగా వ్యవహరిస్తూ, శాంతంగా, సౌఖ్యంగా, సుభిక్షంగా జర్మనీ రాజ్యాన్ని పరిపాలనచెయ్యడంవల్లనే తాను కీర్తి పొందగలననుభావం అల్పుడైన హిట్లరుకు కలుగలేదు కలుగదు కలుగజాలదు అది అసంభవం ముమ్మాటికీ అసంభవం

అందుకనే తాను రాజ్యాధికారం స్వీకరించిన నాటినుంచి, యుద్ధ సాధకం సాగించాడు యుద్ధ విద్యలో నామాదిరిగా ఆరితేరినవాడు ఇంకొకడు యీ ప్రపంచంలో లేడని విర్రవీగడం సాగించాడు "మన జర్మనీని జయించేవాడు యీ జగత్తులో లేడు" అని జర్మను ప్రజలయెదుట ఉపన్యాసాలు సాగించాడు "మన జర్మను ఫిరంగులు చూడండి మన జర్మను విమానాలు చూడండి. మన జర్మను సైన్యం చూడండి! ఎంత బాగా తయారుచేసినానో!" అని జర్మను ప్రజలయెదుట తన ప్రతి ఉపన్యాసంలోను చాటించడం ప్రారంభించాడు "ఇటువంటి జర్మను యుద్ధ సామర్థ్యంవల్ల ఎటువంటి రాజ్యాలను నేనుజయిస్తానో చూడండి! నావంటి వాడు మీ జర్మనీకి ప్రభువైనందుకు మీరందరూ సంతోషించేటట్లు చేస్తాను" అని జర్మను ప్రజలయెదుట ప్రగల్భాలు పలికి, జర్మనుప్రజలనందరినీ, యీ మహాసంగ్రామంలోనికి దింపాడు నేనుకు పెత్తనమిస్తే తలంతా తెగగొరికినదని సామెత చెప్పినట్లుగా, అల్పునకు అధికారమిస్తే, రాజ్యాన్ని ఇటువంటి సంక్షోభంలోకి తీసికొని వస్తాడు వ్యవహారాలు నిర్వహించుకో లేనివాడు, అహంకారంతో అనేక వ్యాజ్యాలలోకి దిగుతాడు ఆఖరుకు తాను భ్రష్టుడై తన్నాశ్రయించుకొనియున్న వాళ్లనుకూడా భ్రష్టులను చేస్తాడు.

ఈ మహాసంగ్రామంలోనికి జర్మనీ రాజ్యాన్ని దింపిన తర్వాత, ఎటువంటి రాజ్యాలతో వైరం పెంచుకొన్నాడో చూడండి ప్రపంచం అంతటిలోను అఖండమైన అయిశ్వర్యంతో తులతూగుతూ, అపారమైన సాధనసంపత్తి గలిగినటువంటిన్నీ, అంగబలములోను, ఆయుధబలములోను, అర్థబలములోను ఎటువంటి రాజ్యాలతోనైనా అవలీలగా పోటీ చేయగల అమెరికా రాజ్యంతో విరోధం పెట్టుకొన్నాడు. అనేక వందల సంవత్సరములనుంచిన్నీ అవక్రపరాక్రమముతో, సకల సముద్రాధిపత్యం వహించి, అఖిల ప్రపంచ వ్యాప్తమహా సామ్రాజ్యమునకు అధిపతులైన బ్రిటిష్‌వారితో విరోధం పెట్టుకొన్నాడు ప్రపంచం పుట్టినది మొదలు నేటివరకు, పరరాజులకు లొంగియుండగని చెక్కు చెదరని మొక్కవోనని ఉక్కు ముక్కవంటి రష్యాతో విరోధం పెట్టుకొన్నాడు బ్రహ్మాండమైన రష్యాతో యుద్ధం చేయడం బ్రహ్మకైనా సాధ్యంకాదు ఇటువంటి మూడు రాజ్యాలతో, ఒక్కసారిగా సవాలుచేసి, తన యుద్ధ సామర్థ్య ప్రతాపమును చూపిస్తానని బయలుదేరినాడు.

చిన్న చిన్న రాజ్యాలను జయించినట్లుగా పైజెప్పిన రాజ్యాల ముందర తన ఆటసాగడంలేదు. వెనుక ఫ్రాన్సును జయించిన తర్వాత "ఇదిగో అగష్టుమాసంలో ఇంగ్లాండుమీదకు దండెత్తి వస్తాను" అన్నాడు కాని, "ఇంగ్లండు చుట్టూ ఉన్న సముద్రందాటి రావడం అసాధ్యమైన పనిరా!" అని అంతటితో బుద్ధిమంతుడై చెంపలు వేసుకొని విరమించాడు. ఇక

రష్యాతో, హోరాహోరిగా నవమాసాలు యుద్ధం చేసాడు “అక్కడి చలి అపరిమితముగా ఉండి—అందుచేత జర్మను సేనలు ముందుకు కదలలేకుండా ఉన్నాయి లేకపోతే, మా జర్మను ప్రతాపం చూపించేవాడినే” అని రష్యావైపు తూర్పుగా తిరిగి నమస్కారముచేసాడు రష్యామీదకు దండయాత్ర సాగించక పూర్వమే అంతకుముందుగా హిట్లరొక ఉపన్యాసంచేస్తూ, అమెరికాతోకూడా తనకు యుద్ధం తప్పకుండా సంభవిస్తుందని అన్నాడు. ఆ ఉపన్యాస సందర్భంలో వజ్రపుతునకవంటి మాట ఒకటి అన్నాడు “అమెరికాతో యుద్ధం అంటే, అమరులతో యుద్ధంవంటిదే—అదే జర్మనీకి ఆఖరు యుద్ధం” అని అన్నాడు. ఈ విధంగా హిట్లరుకు ఇంగ్లాండుమీదకు దండెత్తడం భయంగా ఉంది—రష్యాతో యుద్ధం అసాధ్యంగా ఉంది—అమెరికాతో యుద్ధం సింహస్వప్నంగా ఉంది ఏంజేస్తాడు పాపం? లంగోటాకట్టి సవాలుచేసి గోదాలోకి దిగిన తర్వాత వంట్లో సుస్తీగా ఉన్న వస్తాదులతో కుస్తీ చెయ్యక తప్పదు లేకపోతే తోడా యిచ్చి సలాముచేసి కాలుపట్టుకొని వెళ్లాలి.

అందుకనే, మొన్నటిదినం జర్మనీలో రెడ్‌క్రాస్ సంఘము యొక్క చందాల వసూళ్లనిమిత్తమై ఉపన్యసిస్తూ హిట్లరు ఒక మాట అన్నాడు. “మిత్రమండలి రాజ్యాల విజయం అంటే జర్మనీకి సర్వనాశనం అని జర్మనులు అందరూ గ్రహించవలసినదే!” అని చెప్పాడు హిట్లరు ఎన్నడో గ్రహించి చెప్పవలసినమాట ఇప్పుడు అన్నాడు. పోనీ! ఇప్పుడైనా ఆమాత్రం జ్ఞానం కలిగింది మంచిదే. పూర్వం, ఒక వెర్రి యిల్లాలు పెనిమిటి మీద ఆగ్రహంవచ్చి నూతిలో దూకుతానని శపధంచేసి, నడుము బిగించి నూతిదగ్గరకు వెళ్లింది. కాని, నూతిలో దూకేముందు, ఒకసారి తొంగిచూచింది నీళ్లు ఏమాత్రం లోతుగా ఉన్నాయో అని తొంగిచూచింది. ఇంతలో ఆ పాడునూతిలో కప్పలు బెకబెకమని గోలచేసాయి. ఆ కప్పల రొద వినేసరికి ఆ యిల్లాలుకు భయంపుట్టి వెనుకకు వచ్చింది. నూతిదగ్గరకు వెళ్లడం, వెనుకకు రావడం, చాటున నిల్చుండి పెనిమిటి చూస్తూనే ఉన్నాడు “నూతిలో దూకుతానని వెళ్లినదానివి, మళ్లీ ఇంట్లోకి వచ్చావేమే!” అని అడిగాడు “నూతినిండా కప్పలున్నాయి. ఆ కప్పల రొద చూస్తే భయమైంది లేకపోతే, అనుకొన్నంత పనీ చేసేదానినే” అని జవాబు చెప్పిందట హిట్లరు ధోరణి కూడా ఆ విధంగానే ఉంది తన దగ్గర ఒక అభేద్యమైన అతి రహస్యమైన అస్త్రం ఉన్నదనిన్నీ దానితో ఎటువంటి శత్రువునైనా భస్మం చేస్తాననిన్నీ యుద్ధారంభంలో ప్రగల్భాలు పలికాడు. ఆ మాటల గాంభీర్యంచూచి, తన దేశములోని జర్మను సైన్యాలున్నూ, జర్మను ప్రజలున్నూ, తన అద్భుతమహిమాప్రభావమునకు అచ్చెరువంది, తన ఆజ్ఞను సుగ్రీవాజ్ఞగా శిరసావహించి, తాను ఏ యుద్ధరంగాల్లోకి దూకమంటే, ఏ గోతిలోకి దూకమంటే, ఆ ప్రజలు ఆ సైన్యాలూ ఆ గోతిలోనికి దూకగలరని తలంచి, తన దగ్గర ఏదో గోసాయి చట్కావంటి పరమరహస్యమైన పరమహంస క్రియ ఉన్నదని చెప్పి, కొంత దంభాచారి నాటకం ఆడవచ్చు ననుకున్నాడు.

మొన్నటి పత్రికలో ఒక వార్త ప్రకటించారు. బెల్జియంలో లీజ్ కోటవద్ద ఉన్న జర్మను పటాలములో చాలామంది తిరుగుబాటు చేశారనిన్నీ, ఆ తిరుగుబాటును అణచివేయుటకు తుపాకులను కాల్చినారనిన్నీ, యీ విషయమైన వార్తను ఎవరికీ వెల్లడించకూడదని అచటి బెల్జియం పోలీసులకు అచటి జర్మను అధికార్లు ఉత్తరవు చేసారనిన్నీ మొన్న ప్రకటింపబడిన వార్తలో ఉంది ఆ తిరుగుబాటు జరిగినవిషయం అతి రహస్యంగా ఉంచాలని అన్నికట్టు దిట్టాలు చేసారు. హిట్లరు మాత్రం ఎంతకాలం తన సేనలను మోసంచేసి అంతులేని యీ యుద్ధం సాగిస్తాడు? జర్మనీలో ఫ్యాక్టరీలలో పనిచేసే వాళ్లను కూడా రప్పించి పటాలములలో చేర్పిస్తున్నాడు అందువల్ల అక్కడ ఫ్యాక్టరీలలో పనిచేసేటందుకు జనం కావలసివస్తే, బల్గేరియానుంచి కొన్ని లక్షలమందిని జర్మనీకి తీసికొనిరావలసిందని, బల్గేరియాకు ఒక రాయబారిని జర్మను సేనాధిపతియైన గోరింగు మొన్ననే బల్గేరియాకు పంపించాడు

ఈ విధంగా హిట్లరు యీ సంవత్సరం యుద్ధం ప్రారంభించడానికి, ఇంకా మీనమేషాలు లెక్కపెట్టుకుంటున్నాడు. సూర్యుడు మీనరాసిలోనుంచి మేషరాశిలోకిరాగానే, చైత్రమాసం ప్రవేశించగానే వసంతఋతువులో మళ్లీ గజ్జెకట్టి రంగానికి వస్తాననిన్నీ, అందుకోసం యీలోపుగా రంగులు పూసుకుంటున్నాననిన్నీ అందరికీ వెల్లడించాడు చైత్రమాసం వెళ్లిపోయింది. వైశాఖమాసంకూడా వచ్చింది మీనరాసి వెళ్లిపోయింది మేషరాసి వెళ్లిపోతోంది. “ఇదిగో వస్తోంది! అదిగో వస్తోంది భామవేషం!” అన్నాడు. వైశాఖమాసంతో వసంత ఋతువు వెళ్లి గ్రీష్మఋతువుకూడా ప్రవేశిస్తుంది. ఇంకా భామవేషం తెరవిడిచి బయటికి రావడంలేదు. ఎందుచేతనయ్యా ఇంతఆలస్యం? అని ఆలోచిస్తే, ఒక్కటేకారణం ప్రత్యక్షంగా కన్పిస్తోంది యుద్ధాభినయ శాస్త్రంలో చాలా సమర్థులైన పండితులగు అమెరికావారు, ఇంగ్లీషువారు, రష్యావారు, మీసాలుదువ్వుతూ, హిట్లరు భామవేషం ఎట్లానటిస్తుందో చూడవలెననిన్నీ, రంగస్థలంమీదికి రాగానే తగిన పరాభవం చెయ్యవలెననిన్నీ కనిపెట్టుకొని ఉన్నారు.

అమెరికా సంయుక్తరాష్ట్రముల యుద్ధశాఖా కార్యదర్శియైన స్టిమ్సనుగారు మొన్ననే అన్నారు. “ఇక అమెరికా చూస్తూ ఊరుకోదు. శత్రువుమీదకే సవాలుచేసి, వాడి భరతంపట్టించడానికి నిశ్చయించుకొన్నది” అని అన్నాడు

కనుక హిట్లరు ఇంకా తెరమరగులోనుంచి తన వసంత ఋతువువాయిదాగడువులోగా బయటకురావాలి తన సమర భరతవిద్య ఏమిటో చూపించాలి. అప్పుడుగాని మన మిత్రమండలి వాడి భరతం పట్టించదు ఈసారి సభలో కూర్చున్నవారందరూ కొమ్ములుతిరిగిన సమగ్రసమరశాస్త్రపండితులే. అందుకని భామవేషం ఇంకా బయటికిరాకుండా పైట సవరించుకుంటోంది తెరలోపలనే—ఆఖరుకు గద తిప్పుతూ భీమవేషంగా వస్తాడో, భామవేషంగావచ్చి సభవారికి నమస్కరిస్తాడో చూడాలి.

## జపానువారు దేవాలయములను ధ్వంసం చేయుట

మెహతా జమునిగారు, ప్రపంచయాత్రికుడు యీ వారం లక్నోనగరం చేరెను. ఆతడు జపాను వారి దౌష్ట్యముగూర్చి ఉపన్యశించుచు, తాయిలాండులోను బర్మాలోను వారు హిందూ దేవాలయములను కాల్చి, మతగ్రంథములను తగులబెట్టిరని తెలిపిరి.

తాయిలాండులోను, బర్మాలోని కొన్ని దేవాలయములు చాలపెద్దవి, (భారతీయ శిల్పమునకు మంచిన మోనాలు) అటువంటివాటిపై నిర్లక్ష్యముగ జపానువారు బాంబులువేసి నేలమట్టం చేసిరి. పురాతన సంస్కృత గ్రంధములనుకూడ జపాను సైనికులు తగులబెట్టిరి. అని మెహతా జమునిగారు తెలిపిరి.

# క్రిప్సు రాయబారముల ఫలితం

## ముఖ్యవిషయములందు ఏకీభావం

బ్రిటిషు ప్రభుత్వమంత్రియగు సర్‌స్టాఫర్డు క్రిప్సు గారు భారతీయ నాయకులతో జరిపిన రాయబారములు ముగిసిన పిమ్మట వెలువడిన ప్రకటనలవలన అవి విఫలమయినట్లు స్పష్టమగుచున్నవి. రెండు విషయములందు భిన్నాభిప్రాయము లుండెను. 1. నూతన రాజ్యాంగవిధానము ఏర్పడువరకు దేశ రక్షణ బాధ్యత ఎవరియందుండాలన్నదొకటి, జాతీయ యుద్ధపరిపాలక వర్గం ఎట్లుండవలెననునది రెండోది. సేనాధిపతియు, సైనిక కేంద్రకార్యాలయం క్రొత్త డిఫెన్సుమంత్రి పాలనక్రింద నుండాలా లేక, ఇండియాప్రభుత్వం అధికారంక్రింద ఉండాలా అన్నవిషయంలోకూడ ఒడంబడిక కుదిరినట్లే యుండెను. కాని రెండోవిషయంలో రాజీ కుదరలేదు. క్రొత్త ప్రభుత్వానికి, వైస్రాయికి లండనులో ఇండియా కార్యాలయానికి యెటువంటి సంబంధం ఉండాలను విషయమున వివరములు ఆఖరువరకు చర్చింపబడలేదు. క్రొత్త ప్రభుత్వం బ్రిటిషు మంత్రివర్గంవలెనే సర్వాధికారములు కలిగియుండి, వైస్రాయిగారు అధికారం లేని రాజప్రతినిధిగా నుండాలని కాంగ్రెసు కోరుటె, రాజ్యాంగ విధానం మారకముందే మంత్రివర్గం శాసనాసభకుగాని వైస్రాయికిగాని జబాబుదారీలేక యుండవలెనని కోరుచేయగును.

### ఏకీభావం

ఈ సందర్భమున జరిగిన చర్చలలో ముఖ్యంగా కొన్ని విషయములు గమనింపవలసి యున్నవి. పెక్కు విషయములందు అందరికి ఏకీభావం కుదిరిందనుటకు సందేహంలేదు. ఇండియా భావి రాజ్యకీయపు హోదా యేమిటో, క్రొత్త రాజ్యాంగ విధానం ఎట్లు నిర్ణయించుకోవాలో, అల్పసంఖ్యా వర్గముల హక్కులు గుర్తించాలని ముస్లిము సంఘం వారు పట్టి అల్పసంఖ్యావర్గంగాగాక యెక్కువగ చూడబడవలెనని, వారు భారత సమిష్టి రాజ్యాంగంలో భాగంగానే యుండాలని, యివన్నీ పెద్ద పార్టీలవారందరు అంగీకరించిరి. ఇన్ని విషయములందు రాజీ కుదిరినపుడు, సమస్యాపరిష్కారానికి అందరు సుముఖత గన్పరచినపుడు, సంయుక్త రాజ్యాలతోబాటు యుద్ధంలో చేరాలని పండిత నెహ్రూగారు కలకత్తాలో యీవారం ఉత్సాహం వెలిబుచ్చినపుడు; యీ మూడు వారాల క్రిప్సు గారి కృషి విఫలమయిందన వీలులేదు.

ఈ రాయభారముల రెండోఫలిత మేమంటే, రాజ్యాంగాభివృద్ధికి ఇండియా గమ్యస్థానము బ్రిటిషు సామ్రాజ్యమునుండి విడబడడానికి హక్కుగల అధినివేశస్వత్వము లేక సంపూర్ణ స్వపరిపాలనమని రుజువయినది. విడనాడుట అవసరం కాకపోయినా, అవకాశం ఉన్నది. ఐర్లాండు దక్షిణాఫ్రికాలకున్న స్వాతంత్ర్యము ఇండియాకు ఉండునని క్రిప్సుగారి సూచనలందు స్పష్టంగ తెలుపబడెను.

మూడోలాభం ఏమంటే, సంభాషణలు చాల మర్యాదగ స్నేహభావంతో జరిగినవి. భావి స్నేహమునకు యిదే పునాదు. ఏకీభవించజాలక పోయినా మనాస్పర్ధలు లేవని క్రిప్సుగారే నుడివిరి.

### ఆశాభంగం

ఈ రాయబారం సఫలం కాకపోయినందుకు ప్రపంచమంతా ఆశాభంగం చెంది విచారం సూచించెను. అమెరికా పత్రికలు యింతటితో ప్రయత్నం ముగియరాదని సూచించినవి. ఆస్ట్రేలియా, దక్షిణాఫ్రికా పత్రికలన్నియు యిట్లే విచారం వెలిబుచ్చినవి.